శ్రీ ర స్తు.

---

## రాజయోగసారము-ద్విపదకావ్యము,

### ప్రథమప్రకరణము.

శ్రీగణనాథునాశ్రితపరిపాలు - నాగమసంవేద్య నాధార సదను - ననిశంబుగీర్తించి యతిభక్తి బెంచి - యనువందతరికోండదహారినిమహాను - భావుని భవ్య విగ్రహుని భావించి - పావన మూర్తిని పరమపావనుని - వేదాంతవేద్యునివిశ్వతోముఖుని - నాదవినోదిని నలినలోచనుని - ఆదినారాయణునని శంబు నాదు - మనములోనరహస్య మార్గమందుంచి ॥ ౧౦ ॥ ఘనతమీరగను గంగాయమునలకు- నడుమదివ్యంబయిన నాడికాగ్రమున - నడరిక్రమంబుగా నారెంటిమీద - చెలువుమీరినమేరు శిఖరంబునందు - లతిమీరజ్ఞప్తి కళామాత్రుడగుచు - పరుడౌచు వెలుగు సుబ్రహ్మణ్యగురుని - చరణరేణువయంబు సారెసారెకును - రసావహించిసుస్థిరభక్తి బెంచి - పరమరహస్యంబు భావమందుంచి- రహిమీరసోమేశస్వామినిదలచి ॥ ౨౦ ॥ పిహి

తంబుగా ముక్తిమార్గమేబొందు - కొరకువిద్యారణ్య గురు
నాశ్రయించి - పరమబ్రహ్మేంద్రులబ్రస్తుతి జేసి - ఘనతమీ
రస్వయంప్రకాశులదలచి - యనఘాత్ముడగుసచ్చి దానం
దగురుని - కారణుండగుమల్లి కార్జునగురుని - ధీరుడౌన
వధూతదేశికోత్తముని - నచలితపరమహం సాఖ్యసద్గురు
ల- నచలభక్తునిబడబానలగురుని - యిలరుసుజ్ఞానయోగా
నందగురుని ॥ ౩౦॥ ఇలధన్యులయిన జితేంద్రియగురుసిద్ధియ
రలేకమరియు దిగంబరగురుని - కరమర్థితో పరకాయ ప్ర
వేశ - గురునినిత్యానంద గురురాజచంద్రు - డరయనిరంజ
నుడనుగురుమదిని - గాంచుబోధానంద ఘనపదాబ్జంబు-
లంచితభక్తితోనాత్మయందుంచి - కుదురుగానదియట్టి గు
రుపరంపరను - సదమలభక్తితోసన్నుతింపుచును - వహీ
తోక్తినత్యంతవిఖ్యాతినమరు ॥ ౪౦ ॥ సర్వయోగీంద్రుల స
మ్మతిగాగ - నుర్విలోనీరాజ యోగసారంబు - వలనొప్ప
ద్విపదకావ్యముగారచియించి - యొలమిశ్రీహరికి సమర్పిం
పదలచి ✿ ముస్నాగానాచందములుతేటగాగ - విన్నవించ
దమీకువిశదంబుగాను - వినరయ్యకవులార విద్వాంసులార
వినరయ్యమీరెల్లవిమలాత్ములార - ఘనయతిప్రాససంగతు
లునేనెఱుగ - వరుసనాక్షేపింపవలదు సత్కృపను ॥ ౫౦॥

శ్రీకరంబుగ నారసింహులకరుణ - నీకథాప్రారంభ మే వ్వరించెదను॥

## ——✻ కథాప్రారంభము. ✻——

మహాత్ములార సమ్మతముగా వినుడీ- మహానెన్నద గు కర్దమప్రజాపతికి - ననుకూలవతియైన యా దేవహూతి- ఘనపతివ్రతయైన కామినీమణికి - యనురాగయుక్తుడై యమ్మహాపురుషు. డెనసీపుత్రికల తానింపారగాంచి - తన యులు లేక డెందమున చింతించి - యనుపమంబయిన ఘోరాటవికరిగి॥ ౨౦॥ పరమాత్మ గూర్చి తపంబాచరింగా- నరుడుగా పరమాత్మ డా మహాత్మునకు - పరగ ప్రత్యక్షుడై పలికెనిట్లనుచు - వర మేమినీకు కావలెనని యడుగ - నిని కర్దముడు చాల వివరించి పలికె - నినకోటిసంకాశ యిందిరాధీశ- పరమాత్మ నీవు నాపట్టిగా వలయు- వరమిదె చాలు నేపర ముల్లనింక - ననవుడు పరమాత్మ డావరమిచ్చి - దనరార నంతనంతర్ధానుడయ్యె ॥ ౨౧ ॥ ఆవేళ కర్దము డరిగి వేడుకను - దేవహూతుని గూడి ధీరుడైయుండె - పన్నగానంతట పంకజనాభు - డున్నతుడై దేవహూతిగర్భమున॥

## ——✻ కపిలునిజననము. ✻——

గరిమతో జనియించె కపిలుడను పేర : కరమర్థితోను

ప్రఖ్యాతిగానుండె - బూనికొన్నాళ్ళకు పుణ్యచారిత్రు, డై
నకర్దముడు నిజాత్మజుజూచి - నావరపుత్రక నావంశతిల
క - నీవునాసుతుడవై నిజముగానన్ను ॥ ౮౦ ॥ చెన్నలరం
గ ప్రసిద్ధిజేసితివి - యన్ననాకోరికలన్నిఫలించె - న్యాయం
బుదప్పకా నందమింపొంద - బోయెదనింక తపోవనంబున
కు - ననుచుసమ్మతిజేసియాత్మజుంబునను - తనవధూమణికిత
ద్వివరంబునెల్ల - యలరారదెలిపినదేవహూతి - పొలు
పొందపతిపదంబులకునువ్రాలి - మాలిసియిట్లనె మమతరె
ట్టింప - నోనాథనినుబాసి యొంటితరింప ॥ ౯౦ ॥ జాలనె
నివెంట చనుదెంతుననిన - నాలలితాంగికి నతడిట్లనియె
భామనీవిరీతిబలుకనేమిటికి - నీకుమారుడుధర్మనిపుణుండు
గాన - నీకుజీవన్ముక్తి నిజముగానొసగు - వనములకీవురా
వలసినదేమి - వనితయిచ్చటనెనీవ్రతముఫలించు - ననియొ
ప్పజెప్పియా యతివనుసుతుని - నొనరంగవీడ్కొల్పి యు
చితమార్గమున - వాసిమీరినతపో వనమందుజేరి ॥ ౧౦౦ ॥
యీశాకృతినిమది నెన్నుచునుండె - నికడకపిలు డనేక
వత్సరములకఁజంబుగతండ్రి యాజ్ఞలోనుండి - యామొ
డసంసారమాత్మలోరోసి మాయావిరహితుడై మానవ్ర
తివను. కాననంబునకేగగా దేవహూతి - యానందనునిబా

చియుతివయిట్లనియె- వరపుత్రమీతండ్రివాక్యంబు నేమ - మ
రచితివేమందు మానసమందు - నానాడుకర్దము దరిగెడు
వేళ ॥ ౧౧౦ ॥ నేనుశోకించగా నినుజూపివగవు- నణచికా
నలకేగె నంమహామహుడు - గుణశాలియనుచు కనుగొను
చు నేచింత- నెరుగకయుంటినే నిన్నాళ్ళదనుక - పరగనీవది
యైవభావింపలేక, జనకాజ్ఞమరచివిచ్చలవిడిగాను - నను
విడనాడికా నలకేగదగునె - తల్లితండ్రులే పరదయివంబు
లంచు - నెల్లవారెరుగుదు రెరుగవానీవు, నీమదిలోనను
నీతిభావించి॥ ౧౨౦॥ యీవలమరుమాటలాడకనిలువు - మ
నవినికపిలుండునల్లననవ్వి - తనతల్లినీక్షించి తగనిట్టులనియె

—❋ కపిలుండుతల్లికి విరక్తిమార్గము దెలుపుట. ❋—

నేలఁమజననికీపామరంబు - చాలగానిదివట్టి జాలిజాలిం
చు- తలిదండ్రులెవ్వరుదనయులెవ్వరను - పుత్రిపుత్రాదు
లుబుద్బుదప్రాయ - మాత్రంబులనుచు నీవదినిశ్చయించు-
మటువలెబుద్బుదా లైనదేహముల - కిటువలె భ్రాంతులై
రెల్లమానవులు ॥ ౧౩౦ ॥ కాయమస్థిరమని కనికానలేక-
పామరకసంసార బద్ధులైమమత - వదలకగామ్యార్థ వాం
ఛితులగుచు - మదమత్తులగుచు దుర్మార్గతబొంది - మది
లోనఁబ్బికామక్రోధలోభ - మదమోహమత్సరాల్ మా

టికిజెంచి - సంపదగలిగితేసామర్థ్యమనుచు - సొంపుమీరి నతుచ్ఛసుఖమిచ్ఛయించి- కామాంధులైతేను గతిగానలేక భామలవలలోనబడిలేవలేక ॥ ౧౬ం ॥ తరగనిఈషణత్రయ వార్ధిలోను - మరిమరిమునుగుచు మమతరెట్టింప, నాలుబి డ్డలగనియర్థంబుగూర్చి - కాలంబులూరకె గడుపుచునుండి యంత్యకాలమువచ్చినపుడెయమని - చింతజేయుచుహీం సచేకందిగుంది- కూపంబులోబడికొన్నినాళ్ళుండి- పాపా త్ములగుచుప్రపంచంబునందు - పుట్టుచుగిట్టుచు పొరలుచుం దురు, ఇట్టిపుట్టువుచావు లెన్ననవచ్చు - నవదేవహుూ తినిజాత్మజుకనిరెు - వినుముకుమార యీవిశ్వంబునందు- పట్టుగానిరతంబుబహురూపపటిమె - నిట్టిపిండోత్పత్తియె ట్లగుననిన - వినికవిలుందుబల్ వేడుకతోడ - జననికిట్లనిరెు విశ్వాసంబుమీర॥

## ——— ❋ పిండోత్పత్తిఘట్టము. ❋ ———

వినుమింకతల్లితద్వృత్తాంతమెల్ల- దనరంగనన్నమదంబు నహెచ్చి, సతిపతులిద్దరు సంతసంబలర - రతిసల్పగానను రాగంబుమించి॥౧౬౦॥ నెలవుగాశుక్లశోణితములు రెండు, కలసియేకంబుగా గర్భమందుండి - సెలవుగానైదింట నీ రుబుగ్గను - పనుపడగట్టియా పదిదివంబులకు - నమరి

జడి యెల్ల జెడి తనవణకమంచమున - బడి లేవనోపక బాధల
పడుచు - నాలుబిడ్డలఁ జూచి యకట వీరలను - వాలాయముగ
బ్రోచువా రెవ్వరింక - నని ప్రలాపించుచు నంత్యకాలంబు - క
దిసి వచ్చిన యముఁ గాలకింకరులు॥ ౨౩౦॥ ధట్టించి తను జే
రి దండించి యీలువ - పట్టుదోఁచక భీతిపడి చూచుచుండ - గావా
నిఁ గొంపోయి కాలుని చేతి - కావేళ నిచ్చిన నతఁ డంటవాఁడు - వా
ని పాపంబు లేర్పడ విచారించి - ఘోర నిహింసల బెట్టి పుడమిస్సై
మగుడ - బడవైచు నెప్పటి భావంబుగానె - యెడలేదు దే
హి కిహింస పాల్పరయు - ఘటములఁ దలంచి యక్కడి వారలెల్ల
కటకటా పోయె నంచును దుఃఖమొంది ॥ ౨౪౦ ॥ కానయీ జీ
వునికి శివమార్గంబు - కానంగ లేరు తకరారి మాయవలన
తనువులు తామని తలఁచుచుండుదురు - తనువులోపల కర్మ
తతి విచారింప - నెత్తురు జీవులు నిండు మాంసంబు - హత్తిన
యెముకలు నధిక మాలీమ - మొవసిన చర్మంబు మాత్రం
బు మలము - నెనసి దేహములోన సహ్యమై యుండు - నటువంటి
ఘటములం దాకాంక్ష జేసి - కుటిలులయి తమలోని గురి గాన
లేరు॥ ౨౫౦॥ యనవిని యీయింతి యాత్మజుఁ గని యో - సనా వం
దనిట్టి మాయా ప్రపంచంబు - నెవ్వరు గల్పించి రెలిగింపుమనిన
నవ్వారిజాక్షి కిన తఁడిట్లనియె॥

## —* విశ్వోత్పత్తిఘట్టము. *—

వినిపితమయినయీవిశ్వమంతయును - గలిగినచందంబు క్రమముగావినుము- నిత్యుండునచలుండు నిర్వికారుండు- సత్యుండునగుణుండు సర్వాత్మకుండు - ననెడిపరబ్రహ్మ యాదికాలమున- ఘనతరమై నిరాకారమైయుండె॥ ౨౯॥ నతనియందునాదియయినట్టిమాయ - నతడుగూడివహించెనవ్యాకృతసంజ్ఞ। నెలమినచ్చటగల్గె హేమగర్భుండు। కలకంఠి యాహేమగర్భునియందు - తలగక నటమహాతత్వంబుపుట్టె- నలరంగగలిగెనహంకారమందు - నదిమూడుభాగంబులైవృద్ధిబొందె - ముదితసత్వ రజస్తమోభేదములను- నందుసత్వమునజ్ఞానాత్మకంబయ్యె - పొందుగా రాజసంబున నుద్భవించె॥ ౩౦॥ యలరార కర్మేంద్రియములుతామసము- వలనతన్మాత్రంబు వరుసగాగలిగె- నందుశబ్దంబుననభంబుబొడమె - నందుసదాశివుడధినాథుడయ్యె- మరియునుస్పర్శతన్మాత్రంబువలన - కరువలి గలిగె నకటాడనీశ్వరుండు - నలరార నచ్చటి కధికారియయ్యె- తలకొనియటరూప తన్మాత్రవలన - నొసరహుతాశనుడుత్పన్నుడయ్యె - ననిశంబునిట్టిహుతాశనాకృతికి- తెరగొప్పరుద్రుడధిష్ఠాతయయ్యె - సరవితో రసము

నజలముద్భవిల్లె- హరినాయకుండవ్యో హరిణాయతాక్షి.
మరియును గంధతన్మాత్రంబువలన - సముద్భవంబవ్యో
విశ్వంభరయందు - కమలసంభవుడధికర్తనైనిలిచె - ప్ర
కటితమైన యీపంచభూతముల నొకటొకటి రెండుగా
నొనరభావించి - యందంద నొక్కనిజాంశంబు నుంచి-
యందంద తక్కినయట్టియందొకటి॥ ౨౯౦ ॥ కలకంఠినా
ల్గెసిగావిభాగించి - కలయపంచిన నవిఘనత మీరగన-
పంచీకృతంబవ్యో పంకేరుహాక్షి - అచితంబుగ నీవునది
యెట్టులనిన- నాకాశముననర్ధమవ్యో జ్ఞాతృత్వ - మం
దుదక్కినయట్టినాల్గుయంశములు- పవనాగ్ని జలములనవ
నియుగూడి- మనసుబుద్ధియు చిత్తమాయహం కృతియు-
మొలిచెనవ్యాతరాలముల నర్ధభాగ॥ ౩౦౦ ॥ మరలవ్యా
నంబవ్యో నటునిల్చెనాల్గు- నలరభూసలిల వహ్నియు ని
మిషమాగక్క- ములగూడియుంతకుమరాలంబునపుచు- మొ
నయపాణ్ అపానమును దానమవ్యో - ముదితహబుతాశ
నార్ధముచక్షువవ్యో - నలువంద దక్కినవాల్గు భూనీర-
మరుదంబరములసమ్మదమునగూడి - అరయుత్వక్ఛ్రోత్రజి
హ్వఘ్రాణములను - గలిగెనీరర్ధభాగము రసంబవ్యో-
నలినాక్షితక్కిననాల్గుసహవహ్ని ॥ ౩౧౦ ॥ మరుదంబర

బులమచ్చికైగూడి- యారూపమాశబ్దమాస్పరిశంబు - ఘ
నతరమైనగంధంబుననవ్యే - మొనసి యావసుదార్ధము
పాయువవ్యే- దలిరాకుబోణివినదకిపానన్నాల్గునలధనంజ
యప్రభంజననభంబులను- సారంబులైకూడి సల్ప్రక్రియల
కు-నారూఢిహేతువులయినట్టిగుహ్యా - హస్తవాక్పాదం
బులనువొందగలిగి- విస్తరిల్లెనుపంచవింశతిక్రమము॥

—* పంచవింశతి తత్వప్రకరణము. *—

మానినియింకొక్క-మార్గంబువినుము - పూనియిట్లగు
పంచభూతంబులకను - బలముసద్యోజాత వామదేవులను-
బొలతియ ఘోరతత్పురుషులీశాను - డనెడుపంచబ్రహ్మ॥
లాబ్రహ్మవిష్ణుడును రుద్రుడీశ్వరుడాగిసదాశివుడు - పం
చకర్తలనంగ ప్రఖ్యాతులైరి - యంచితమైమాన సాధు
లునైదు, రాణింపగాను పరాశ-యయ్యె- ప్రాణాదివా
యువుల్పట్టుగాబూడ॥ ౩౩౦ ॥ నాదిశక్తియనంగ నమరె
శ్రోత్రేంద్రియా ... వ్యేను విజ్ఞానశక్తి- పరగనీశానా
ద్యాది పంచతత్వములు, సరవితోబూడ నిచ్ఛాశక్తియై
యెవ్యె, క్రమముగావాగాది కర్మేంద్రియంబు- గానలమర
విక్రియాశక్తియనవ్యె, నన్నియుగూడి బ్రహ్మాండమై నిలి
చె. పొలుపొందగా విరాట్పురుషరూప। ఖ్యాతిగానాజ

గదాకృతికరయ, పాతాళలోకంబుపదములుసత్య॥ ౩౪
లోకంబు శీర్షంబులోలాక్షిమధ్య। లోకములెల్ల నాలో
కింపనాదు- తనువుబుగా వెల్గుతరుణీలలామ - యనువం
దనిట్టిమహావిగ్రహంనకు- కోనకోని సర్వదిక్కులు శ్రోత్ర
మరయ- నోసరంగ వినుము వాయువుత్వగింద్రియము,
తెరగొప్ప చక్షురింద్రియము భానుండు, పరగఘ్రాణయు
గ్మంబుబ్రహ్మపదంబు - చెలువందవరుణుండు జిహ్వేం
ద్రియంబు, నెలతఘ్రాణంబశ్వినీదేవతులను॥ ౩౫॥ వలనొ
ప్పగావహ్నివాగింద్రియంబు - తెలియబాహువులెల్ల దే
వతాధిపుడు - పరగనుపేంద్రుండు పాదేంద్రియంబు, పరి
కింపగాప్రజాపతియగుహ్యంబు, వలనొప్ప మృత్యుదేవ
తయగునంబు- కలువపువ్వులచెలిగాడుమనంబు - మతిబ్ర
హ్మదేవుండుమహానీయచిత్త - మతులితక్షేత్రజ్ఞు డనబడు
చుండు-ననుపమాహంకారుడగు రుద్రమూర్తి, దనరంజ్ఞా
త్మత్వమంతఃకరణంబు ॥ ౩౬ ॥ సంవితో జీవునిచందమీమీ
ద- నెఱుగజెప్పెదవినుమేర్పాటుగాను, అలరారుచున్న ఘ
టాకాశమందు, కలిగిన జలములో కనుపించు నభము-
తెరగునసాక్షియందేయున్న బుద్ధిప్రతిబింబితంబయిన బ్ర
హ్మమీరీతి, జీవుడనను భ్రాంతిచే జిక్కిమించి, సావధాన

క్రియాశక్తినిగూడి, రరాధిక్యమై తనస్వస్వరూపంబు మరచి, మూఢుండై షడ్వర్గములకులోబడుచు ॥ ౩౭౦ ॥ తులువ నైమానసాములచేతచిక్కి, కలుషాత్ముడై తన్నుగానక భ్రమసి, భిన్నభావములచేత బెక్కుదేహములు- పన్నుగా ధరియించిపరవశత్వమున, స్త్రీలుపురుషులటంచు భేదభేదముల, వాలాయముగజిక్కివాంఛతోదగిలి - వారునువీరునువారునేమనుచు, భారంబునను యహంభావ మూహించి- జీవభ్రమములచేచెడి పలుమారు, చావుపుట్టువుగలిగి జడుడాయెనిపుడు ॥ ౩౮౦ ॥ ఎప్పుడైనను జీవుడిదియెల్లరోసి- యొప్పగు విజ్ఞానయుక్తినిగూడి, తన్నుదాదెలసినధన్యునిజేరి - పన్నుగానతనిచే బ్రహ్మంబుదెలిసి, కామాదిశత్రులఖండించివైచి, యామూడు సర్వేంద్రియములజయించి, నిటలభాగంబుననిలిచి శోధించి, ఘటము బయల్ చేసి కడగాంచెనేని యతడె పరబ్రహ్మమతడెస్వయంభు- వతడెమహావిష్ణువతడెపోశివుడు ॥ ౩౯౦ ॥ అతనికివేరులేదనుచుబోధింప, నతనికిట్లువిపలికెనాదేవ హూతి మలమూత్ర రక్తదుర్మాంసమోహ్యాంబు, గలిగిన దుర్గంధకాయంబులంట- నిరవుగా నాబ్రహ్మ మేరీతినుండు, నెరిగింపుమని పలుక నెరిగింపదొణగె - యిదిసోమనా

థలి శ్వేశ్వరుఁ షేక- బవవాక్యభవ్యసుబ్రహ్మణ్యయోగి, చర
ణాంబుజాత షట్చరణాయమాన - పరిపూర్ణజ్ఞానిత్యా స
ద్భావనిమగ్న॥ ౪౦౦ ॥ మానసయగు వెంగమాంబికారచి
త- మైనట్టి రాజయోగామృతసార, మందెన్నగా ప్రథమ
ప్రకరణంబు, పొందుగా తరికొండపురిధాముడైన, వీర
నృసింహుడు వెలయుగైకొనియె- ధారుణినాచంద్ర తారా
ర్కముగను॥

ప్రథమప్రకరణము - సంపూర్ణము.

రాజయోగసారము- ద్వితీయప్రకరణము.

శ్రీకరానందవశీకరమైన, పాలికటభక్తిని భావమంత
యును, విచుమునీవత్యంతవిశదంబుగాను- కనుము సుగంధ
దుర్గంధముల్ రెండు - ననుపమపరమాత్ముడంటి రెన్నటికి,
దనరంగమరియు మేధ్యామేధ్యములను - ప్రతిఫలింపదెదూ
డభానుకరాళి అతనికిమేమంటె నాచందమునను, యతు
లితంబుగనాత్మకంటజేమియును, మతిమంతులకు నట్లమలి
నంబులేదు, కుటిలత్వరహితయొక్కవగాగనిట్టి, ఘటము
లోచందంబుక్రమముగా వినుము, విలసితపంచవింశతితత్వ
ములను, నావృతంబైస్థూలమనవొప్పియుండు, కాయంబు
లో సప్తకమలంబులుండు, నోయమ్మ మదియున్నయునికిచె

స్పైదను-తొలుత నాధార చుందో యుజాతంబు - సలలితమై
నరహంస్యస్థళమంచు- గొనకొని నాల్గు రేకులు పీతవర్ణ- ము
సు వశషసలనుముఖ్యాక్షరములు- ననువంద భూముద్రనమ
రుచునుండు- నెనసియచ్చటను గంగేశ్వరుడుండు- యల రా
రవిను దాని కావలి విధము- దలకొని యంగుళద్వయము మీద
టను- ధీరత మీర స్వాధిష్ఠాన జలజ- మారు రేకులతోడ నమ
రు శ్వేతముగ- నదిబభమయరలా యనువర్ణములను-నది పక్షి
ముద్రననొయ్యఁ బరగు జలజాతభవుడు సౌఖ్యల మొప్పనుం
డు- యలఘు|| కాశు ద్రైయచ్చటనుండి- మొనసియష్టాంగు
ళములమీద దనరి- యానువంద మణిపూరకాఖ్యంబు వెలుగు-
నెన్న రేకులు పది నీలవర్ణంబు- డాదిఫకారాంత వర్ణముల్ గ
లిగి- యనువర్ణములు గలిగి యీపీత ముద్రయొనరంగ విష్ణువం
దున వెల్గుచుండు- పదియంగుళములకు పైన నాహతము హృ
దయప్రదేశమందిరనుగానుండు- భామవిక ద్వాదశపత్ర
ముల్ గలిగి- హేమవర్ణంబున సింపొందుసందు - నఖిలవా
క్యావళీకాస్పదంబగుచు- కఖగఘజలు చఛాఖ్యలు జఝఞ
లు-ననువంద గాటశాయనులింగముద్ర- సనబోణిరుద్రుడు
నాధుడచ్చటికి- నావలమరి ద్వాదశాంగుళములను ధావళ్య

రుచివిశుద్ధంబు బడారు- దళములైదిఆలు దానికివర్ణ- నగన
దిమత్స్య ముద్రజీవుండు- అందుండు మరిద్వాదశాంగుళము
లను- పొందుగా భ్రూమధ్యమునదళద్వయము- అందు పావ
కదీప్తియలరుచునుండు- నందుహంసలు రెండునమరుచునుం
డుకరమర్ధినమరు ప్రకాశముద్రదిమె - పరమాత్ముడచ్చట
పతియై వెలుంగు- నందుకునవలసహస్రారమందు- కాంతి
మీరగను హాకార షకార - బీజద్వయంబాత్మ బిందువుగూడి-
తేజరిల్లుచునుండు దేదీప్యముగను- గగనముద్రదియు వోక
ములదళాక్షి- సగుణనిర్గుణరూపసచ్చిదానంత- గురురాజ
చంద్రుండుకోమరొప్ప మిగులసరవినన్నిటికిదా సాక్షియై
యుండుపసిబూని వినుమంబ ప్రాణానిలంబు - మొనసియా
హృత్పద్మముననిలచియుండు- తరుచైన పవనుడాధారచ
క్రమున - విరివిగానేనేళ విహరింపుచుండు - యలగ
మానుడునాభియందునవ్యాసు - డలరిసర్వాంగంబులందు
తానుండు- గళమునరోమసంఘుంబులయందు - తొలగక
నాగవాతూలంబుమరియు ననఘులరాట మందాకూర్మశ
వను- తనువందఘ్రాణమందాకుకురుండు - కంటిమీదను
నుండుఘనదేవదత్తు - డటబ్రహ్మరంధ్రమందా ధనంజయు

డు- అనుదశవాయువులంగంబులందు-మొనసితత్తత్కార్య
ములుసల్పుచుండు- లలినియిళాపింగళలు సుషుమ్నయును-
యలరారయాధారమందుండివచ్చి- మొనసియాజ్ఞాచక్ర
మునమూడుగూడి- యనువొందగామరియంతటనిలుచు- ద
నరసుషుమ్నమంతటనిల్వకరిగి- యరుదుగా ఘనసహస్రా
రంబుజేరి- గురుతరంబుగనతనిగోప్యమైయుండు- దేహమ
ధ్యంబునదిరుగుజీవుండు సోహంమనుచుమహాస్ఫురణ దీప్తి
ష- మొనసియహోరాత్రములనుజపంబు- నొనరంగ యి
రువదియొక్క-వెయ్యారు- నూరును జేసి యనవానంబుగాగ
నారుమూరాదిగణాధీశ్వరునకు- నారువేలును బ్రహ్మకా
ర్వేలుహరికి- నారువేలునురుద్రుడనుదైవమునకు- వేయు
సదాశివవిభవమూర్తికిని- వేయుపరమాత్మకువేసద్గురున
కు-వాసిగాదినమునువరుసనర్పితము- చేసుటకాని యాజీ
వుండుమగుడి- భాసురమతిసిట్టిభావంబుగాను- యోసార
సాక్షిదియుక్తిచేగని- కాశిగయాప్రయాగలు నందెయుం
డు- దేశికుడటమహాదేముడైయుండువోడిమిమీర బెంపొం
దుచుమధ్యనాడీసహస్రారనాళమైయుండునదియె సరస్వ
తిచుదిపరంజ్యోతియదియూర్ధ్వకుండలియదె సుధాధార

యాదిభూతతతిహేతువదెతటిద్వల్లి- యదెచిద్విలాసంబు
నదిపరమంబు- ఇటువంటిసుధ దెహికంటనియ్యకనె- కుటిల
తమోగ్రతనధఃకుండలిపొంచి పటుశక్తినమృతంబు పానం
బుసేయ- నిటువంటికీలకంబెరుగక దేహి- కాయమేనని య
హంకారియైయాత్మ- నాయకుగనలేక నానావిధముల- ము
క్తిబొందెదనని ముందుగానకను- శక్తిచేకర్మముల్ సలుపు
చునెపుడు- గాసిల్లుచునుకర్మకాండలోతగిలి - కాశికిబో
యితకర్రాకగంగలోన - అంటుకుండనుమునిచినప్పుడేదాని-
యంటుబోవునె మోక్షమబ్బునేతల్లి - యనియిటుబలికిన
యా దేవహూతి॥

—* జీవన్ముక్తివిచారఘట్టము. *—

తనసుతునీక్షించితగనిట్లులనిమో- పావనచరిత జీవన్ము
క్తినరున-కేవిధంబునగలుగునెరుగింపుమనిన - జనయిత్రిజూ
చియాసంయమీంద్రుండు - మనమునహర్షించిమరియునిట్ల
నిమో- వినవంమజననియీవిశ్వంబునందు- మనుజులునన్యక
ర్మంబులువిడిచి - తనుదానెదెలసినధన్యునిజేరి - పసిబాని
ద్వాదశాబ్ధములుశుశ్రూష - జేసిమెప్పింపగా శ్రీగురుమూ
ర్తిజా- భాసురంబుగవానిభక్తికిమెచ్చి - యసదృశసిద్ధాసనా

సీను జేసీ- భసితంబు తనఫాలభాగమందుంచి - వానితత్త్వా
ర్థపువార్తెల్లదీసి- ప్రాణితానేకవార్తలు పొందుగావ్రాసి-
జడియకుమనివానిజడు పెల్లడిర్చి- కడువేగ రాజయోగ ప్ర
కారంబు- సాంగంబుగాజెప్పిజడతబోమీటి- శృంగాటకం
బునజేరిచూడనిన- గురుమూర్తినప్పుడు మకుటావమీరిశిష్యు-
డరుదుగాతనమానసాబ్జమందుంచి- పరమార్థసరణి సద్భా
వంబుమీర- పరమామృతధ్యానపరవశత్వమున- మనసున
హాసాగ్రమధ్యమందుంచి- మొనసి తానప్పుడు షణ్ముఖియ
నుముద్ర- లోచూడజూడంగలోకమంతయును - ఆచోటులీ
నంబులై యొంకార-బంధురమై జీవపరమాత్మలకును - సం
ధానమొనగూడుసమయంబురాగ - ప్రణవమందు పరోక్ష
భావానుగతిని- ఘుణఘుణత్కారమైగగనమార్గమున-మొర
యుచునుండుత్రిమూర్తిస్వరూప- పరమార్థమని దానిభా
వించవినగ- పంచనఖంబులేర్పడగానవచ్చు - నంచితముగ
నందునరసిచూడగను- గొనకొనికార్మొరుంగులు పుష్పవృష్టి
యనుతరంగములుమయూరపింఛములు - సలలితవిమలన
క్షత్రముల్దీప - కళికలురవిచంద్రకళలుశోభిల్లి - వింతగా
నప్పుడువెలుగులోపలను సంతసించుచునుండు సద్గురూక్తి

ముగ- బరానియుండినపూర్వబోధలోజెందిజ్ఞానాంజనము
నిశ్చలమ్ముప్పజూచి- కపటప్రపంచాంధకారంబుబాసి యీ
వుడుస్థావరజంగమాకృతులెల్ల - మొనసిభూమినణంచిము
స్సిటముంచి- యనలంబులోవేర్చియనలంబుజేర్చి - యనలం
బునాకాశమందునగూర్చి- ఘనమైన శూన్యమార్గంబుననిలి
చి- తరుచైనహంకారతత్వముల్మీర- యరసిమహాతత్వమ
తివేగదాటి- శ్రీమహితానందసీమలోజేరి- యామోదమ
లరిదృశ్యావళుల్మరచి - సలలితానందుడై శాంతివహిం
చివెలిలోనులోలోనువెలియునుగాని - తెలివిదాననిచూడు
దివ్యశాంతునకు- ముల్లెల్లవిడుచును మోక్షంబుగలుగు- సిట్టి
జీవన్ముక్తియెంతజూచినను- కాశిగయాప్రయాగలనైనలే
దు- దేశదేశంబులుతిరిగినలేదు- వెలయసంసారముల్ విడి
చినలేదు బలుక్షుత్పిపాసలుబట్టినలేదు శిలబొమ్మబూజ
లజేసినలేదు తలపదిగంబరత్వములలోలేదు - జడలుదాల్చి
నలేదుసార్వకాలంబు - నడవులవర్తించియలసినలేదు-స్నా
నదానసకామజపములలేదు- మౌనంబులనులేదు మాటల
లేదువితరణంబులలేదువిద్యలలేదు- వ్రతములలోలేదు క్ర
తువులలేదు- మతములలోలేదుమహిమలోలేదు సతతంబు

నన్నియునల్పువారలకు- నలరారగానుస్వర్గాదిభోగము
లు- కలిగియాపుణ్యముల్ కడముట్టగాను-సమసినప్పుడెచాల
జన్మంబులెత్తిహింసలబడుచుండునెప్పటివలెను. గనుక స్వ
ర్గాదిభోగములిచ్ఛయింప- కనుమనశ్శుద్ధిజకర్మగజేసి పర
మ- సద్గతిగానువిచారించి యపుడు- సద్గురుచే వేదసారం
దెలసి- మమతవిడిత్రికూటమార్గంబుజేరి- రమణీయసాం
ఖ్యతారకమనస్కముల- గలిగినయనుభవత్రయముల దెలసి
సలలితశివయోగసచ్చిదానంద - వైరాగ్యసుఖకేళివార్ధి
లోమునిగి- యవధూతభావుడైయాత్మనుజెంది - తాననే
టియహంబుదగ్ధంబుజేసి- తానుతానైయున్న తత్వంబుదె
లిసి- నిగమాంతవేత్తయైనిలిచినవాడు- మగుడిందురాడుజ
న్మముళెత్తబోడు- మరికొందరీమహామహిమగానకను- గు
రునెరుంగనికర్మగురుచెంతజేరి - గాథలోబడి మహాకఠిన
మార్గమునసాధనంబుగయోగసరణుల దెలిసి- యలమటనా
సనాభ్యాసముల్ చేసి- చలమునబాహ్యలక్ష్యములుజూపుచు
ను-కూలంకషములోనిగురిగానలేక లాలితంబుగ మంత్రల
యహఠయోగ- ఫలవాంఛలనుజిక్కి-పామరులగుచు - జల
బుద్బుదమువంటి జ్ఞానంబుల్కను. సిద్ధులగోర్తి ప్రసిద్ధమై

యోగ- సిద్ధాంతమందునుస్థిరమతిలేక- యగణితవిషయము
ఖాసక్తిమీర- తగమణిమంత్రసిద్ధక్రియల్ నేర్చి - మరిపాము
రులకెల్లమహిమలుజూపి - తిరిగెదు వారలీదేహవాసన
లు- వీడగానేరరువేదాంతమందుకూడనేరరువట్టిగుంభనే
గాని- వరము క్తిబొందెడువారు త్రికూట - ములనిష్ఠతో జే
రియునికియుజెంది- నెలవుగానాత్రివేణీసంగమమున జల
కంబులాడివిశ్రాంతివహించి- వెలిప్రపచంబునువిడిచి యా
లోన-నిలిచివెతిగెడి తెలివినేననినిజము- నగసినబ్రహ్మవిద్యా
ధురంధరులు- గొనకొనికాయసిద్ధులుగోరబోరు- యారక
సంసారయుక్తులై యుండి - ధారాళముగతమ్మువాముబా
చుచును- జలజపత్రంబులోజలముచందమున- నలరసంసా
రమందుండియంటకనె- యుండుధన్యులుసిద్ధయోగులుగాక-
ఖండవిద్యలునేర్చి గర్వంబుపూంచి - స్తంభనమోహనో
చ్చాటనమంత్ర- జృంభణంబులుజూపిచెలగెడువారు, పవ
నయోగమునేర్చిశటయుక్తిబెంచి- యవిరళంబుగ కటా
కాంతరమందు-మహిమజూపుటకుపద్మాసనంబునను సహ
జంబుగానుండి జనులమెప్పించి - బద్ధులైయుంతకుపరమైన
యోగ - సిద్ధాంతమెరుగక చెడిపోవువా - కడుపుసిడుగ

నుదకంబునుబిల్చి । కడుపులోమలమెల్లగడిగిశోధించి । యి
దియాత్మసిద్ధియటాననిశ్చయించి । ముదమొందితపములోనె
మురిసేటివారు । వాయువుధారణజేసి వసుధపైవ్రేల్లు।
కాయంబుకొన్నాళ్లుకాపాడువారు। ఆత్మానుభవులుగాన
రసివీక్షింప । ఆత్మనుగాంచినయుపధూతమూర్తి । యలన
భోమధ్యకుంభాకృతగాను । వెలిలోను వెలుగుచు వినయ
శూన్యముగ। జలరాశిగతకలశంబుచందమున । పొలుపొం
దవెలిలోనుపూర్ణమైనిండి । యంతయుదాగాక నంతదాన
గుచు। సంతతానందాబ్ధి చంద్రుడైయున్న । యతడెయోగీ
శ్వరుడతడెధర్మాత్ము । డతడెపరాత్పరుడతడెసద్గురుడు।
యిటువంటిగురుతత్వ మెరుగకనీవు। మటుమాయగాజిక్క
మైనీడవలెను। తనవారుపరివారు తగుపాటిబంధు। లనియెం
దభ్రమలుసత్యంబుగానమ్మి। ననుజూచినీవుకానలకేగదగు
నె। యనిపలికితివిమాయననుసరించుకొని । భూసురవతిని
ట్టిభావంబువిడుచు । నీసుతుడనుకాను సిరజేష్టుడ । నా
నాడుకర్దముడత్యుగ్రతపము। పూనిచేసినమెచ్చిపుత్రుడనై
తి । గానసేనీసొమ్ము గానునికరముగ। మానసంబుననిదిమ
రువుమోతల్లి । సుతుడనిమదిలోనచూడకయింక । సతలాడి

గావు। భావనాతీతసచ్ఛిద్బ్రహ్మంబునీవు । నీవెయఖండంబునీవ
వ్యయంబు। నీవెప్రకాశంబునీవెబ్రహ్మంబు । నినునీవుదెలిసిన
నీకన్యముగను। కనుపించువస్తువెకరూడనైనలేదు । అనియిట్లు
పలికినన్నాయింతిసుతుని । కనుగొనిపలికెచకరూనియుక్తిలో
ను నేనెబ్రహ్మంబునైనిర్వికల్పంబు । గానుండగానెయీకర
ణేంద్రియును । ఆహారమునుగలుగునట్లుండుటేమి । యో
హోరావిచిత్రమైయున్నదిదీని । భావంబుదెలుపు తప్పకను
న్ననతడు। దేవహూతికినిట్లుదెలుపగాదొణగె। నిదిసోమ
నాధవిశ్వేశరూపెం। పదవాక్యభవ్యసుబ్రహ్మణ్యయోగి। చ
రణాంబుజాతషట్చరణాయమాన । పరిపూర్ణనిత్యసద్భా
వనిమగ్న। మానసముగువెంగమాంబకారచిత।మైనట్టిరాజ
యోగామృతసార। మందెన్నగాద్వితీయప్రకరణము। పొం
దు గాతరికొండపురధాముడైన । శ్రీనృసింహుండు వెల
యనైకొనిమె । ధారుణినాచంద్రతారార్కముగను॥

ద్వితీయప్రకరణము - సంపూర్ణము.

## రాజయోగసారము- తృతీయప్రకరణము.

శ్రీరాజయోగసుస్థిరమహామహిమ। సారమైవెలుగుము
జ్జనములయందు । హరితాక్షినీవిప్పుడడిగినప్రశ్న। సరవితో

వినుమతిసమ్మతంబుగను । ఘనతర మోహదుఃఖములను రెం
డు । దనరారగామనోధర్మంబులరయా । బలములైతగక్షు
త్పిపాసలు రెండు । వలప్రాణధర్మంబులనబడుచుండు । మ
ర్మంబువినుజననమరణములైదేహ । ధర్మంబులనబడు తరుణీల
లామ। యిదియెషడూర్ములై యెల్లకాలంబు । నవిరళంబుగ
నాత్మనంటినట్లుండు । నాయాత్మకొకటినంటదు మోహిం
పు।నాయాత్మసాన్నిధ్యమందు సంతతము॥

—* పంచవింశతిప్రకరణములు. *—

గగనంబుశ్రోత్రమై గగనసంబంధ । మగుచున్నశబ్దంబునాలిం
పుచుండు । ననిలంబుత్వక్కులై యనిలసంబంధ। మనదగుస్ప
ర్శనెల్లెడనైన దెలియు । ననలంబుచక్షులై యనిలసంబంధ
మనవొప్పు రూపంబునరుదుగాజూచు । జలముజిహ్వై జల
సంబంధమగుచు । విలసిల్లురసమును వింతగాగ్రోలు। జగతి
యాఘ్రాణమై జగతిసంబంధ । మగుచున్న గంధంబునిదుర
గ్రహించు। వరుసగాబలుకును వాగింద్రియంబు। చరియింపు
చుండును చరణేంద్రియంబు। సొరిదిగానిచ్చిపుచ్చుకొనుహ
స్తములు । పరువడిపాయుపస్థలు రెంటివలన। మలజలసర్జన
మగుచునో తల్లి । నిలయంబులై యుండు నెరి నెందుకైన।పన

మలంబుజేరి । యమరనచ్చటపరమానందమేమొ। కరము
ప్పత్తుణాముంత్రిక్రంమరదిరిగి॥౯౦॥ సరగుణసామ్యపంచకము
నుగూడి। మొనసియాజ్ఞాచక్రమునునిల్చియుండు। వనజాక్షు
డుదయించివచ్చినజనులు । మురిసితత్తత్కార్యములుసలు
పుసగిది। నరయుభ్రూమధ్యమందాత్మభాసకుడు। నిలిచి
యుండినవేళనిఖిలేంద్రియంబు । నలరారతమపనులన్నిగా
వించి। యవలసుషుప్తియందనుదినంబుగాగు । నవియెల్లనీవు
గాదాయుక్తివినుము । అనువందనివియెనీవైనసుషుప్తి। న
నువిత్యమొందకునశ్వరంబగుచు ॥ నీకునాశములేదునిత్యం
బటంచు।ప్రాకటంబుగశ్రుతుల్ పలుకుచునుండు । కావునవి
లయమొనర్చెడనీకుగలదె । యీవిధమింద్రియావస్థలనయిన
భావమెల్లనుతేటపరచెదవినుము । సావధానంబుగచక్క
గానిపుడు। ఎపుడునీదేహంబునెరిగెడితెల్వి। యప్పుడుసుషు
ప్తియంతదియందుబోయె । సహజంబుగాదానిసరణియెట్లు
నిన॥౧౦౦॥ అహమనియెడిభావమాసుప్తిలోను। లయమైన
వేళనిలాలితజ్ఞప్తి జయముగానచటనే సాక్షియైయుండు।
యిదిలేకయుండినయింతలోగానె । నిదురమేలుకొనిలేచి
నేనింతతడవు । హాయిపొందగానిద్రబోయితిననుచు । తెలి

యువా రెవ్వరా తెలివియుగాక - యానిర్గుణజ్ఞప్తియందుం
డగానే. ప్రాణియహంకృతిబాడముక్రమ్మరనే- యానిర్గుణ
జ్ఞప్తియుటలేకయున్న ॥ ప్రాణిదానికియి దేహైకశైయుంసు-
మామంచిదల్లైయినమానితజ్ఞప్తి. యాంచితమై దేహామంసు
తానుండి - మందమై దేహాంమమరుచు టేమనిన- యందహం
కృతిలేకనానిర్గుణాత్మ - తాను తానై యుండుతన్మయత్వ
మున-గాననహంకృతికరణిసంతతికి - అమరకారణమవ్యా
నాయహంకృతికి- నమలాత్మకారణమనిచెప్పబడును- ఆరీతి
యెట్లన్ననయ్యాహంకార ॥ మారయసుప్తియందణగినయప్పు
డు - నిండివెలుగుచునుండునిర్గుణజ్ఞప్తి - యుండగాగదమరి
యొకకొంతప్రొద్దు - గనినపిమ్మటనైః గ్రహుస్తనలేచి - గను
నీప్రపంచసంగతులాత్మనిచట - నుండకయున్నయే- యూ
హింపరాదు - ఖండితంబుగసర్వకారణమాత్మ. యాయ
హంకృతిహేతువఖిలకృత్యములు - నాయహంకృతిశూన్య
మైనవేళనను- సత్యాత్మకిప్రపంచక్రియల్ లేవు ॥ నిత్యమైశు
ద్ధమైనిర్వికారమున - తాను తానైతాను తనలోనె వెలుగు-
గానయాత్మయెనిర్వికారనిర్గుణము - ఖిలస్వయంజ్యోతిమై
యిప్రకాశించె- లవిమీర గాను కాలత్రయంబునకు- సరి యు

నవస్థాత్రయమునకు దేహ - కారణాలకుమూలకారణంబ
గుచు - సుక్షేత్రనయనాగ్రసుషిరాంతరమున నక్షయంబైప
రమాత్మకనిత్య - పరిపూర్ణమైపరబ్రహ్మమైవిమల॥ తిరమై
పరాత్పరతత్వమయి భేద- రహితమయియమితమయిరమ్య
మయిచూడ - సహజమయియచలమయిశాంతమయియొన
ర- సదమలవేదాంతసారమయిమరియు - నిదురకు మొదలు
గానిర్మలంబైన - తెలివికితుదయునై జేదీప్యముగుచు-సలలిత
మయిసర్వసాక్షియైదనరి - గణనాధికానందకారియునగు
చు- ననువుకునను వైనయనవరతంబు - నామహాత్మకుమహా
త్మయి రెంటికన్న॥ తామించిపరసత్తామాత్రమగుచు- వెలి
లోనుశూన్యముఁను వెలిలోనువండి- వెలిలోనుగాక నే వెలుగు
చుచుండు - అనినీవుగాబాచియానందమొందు - మదియెట్ల
నెనానుననియంటి వేని - యుద్ధంబులో జొచ్చినటువంటిగగన
మద్వంబుభిన్నమయినప్పుడుతనకు - కారణమయినయాకాశ
మునగలయు - నారీతి గాబుద్ధియణాగిఁ పిదప - పరికింపజీవు
డక పంచవింశకుడు॥ అరయగాషడ్వింశకాభిధానంబు- కలి
గినయాబ్రహ్మకళయందెగలయు - నెలనాగభావింపుమిద్ది
సాఖ్యసరణి- యుదిశాస్త్రములచేత నెరిగినంబటనె - పాలు

స్థైనసంశయంబులువీడరాదు - వరశక్తిసుజ్ఞానవైరాగ్యస
రణి- నరయూచునీయోగమనవరతంబు- మననంబుజేసిసమ్మ
తమొందవలయు- మననంబుసేయక మరియుండిరేని- యామా
నంబుననింద్రియాదులగూడి ॥ కామాదిశత్రువర్గమునాశ్ర
యించు - కావునమదినిచక్కగబట్టినిలుప- గానలేనిలుపకే
కట్టితిదీమనంబు- తారకయోగాభ్యానిరతైనట్టి ధీసుమదా
నిజంపింపగానేర్చు- ననియిట్లుపలుకగానాచంద్రవదన- తన
యునిజూచిసంతసమొప్పబలికె॥

## ——— ❋ తారకలక్షణము. ❋ ———

ఓతండ్రి తారకయోగలక్షణము- ఖ్యాతిగాజెప్పెదగడ
తేస్పమనిన - ఆనందమునుబొందియమ్మహాశుభాంగుడు-పూని
తల్లికిట్లుబోధింపదొడగె - నోయమ్మ తారకయోగలక్షణ
ము- క్రమమొప్పసకలయోగంబులలోన- విమలముగుశ్రేష్ఠ
మయివెలయుతారకము - వినవమ్మయిది రెండు విధములై
యుండు- నేనెపూర్వాపరయోగంబులనగ - అమరనప్పట
పూర్వమగుతారకంబు- క్రమమొప్పరాజయోగంబపరంబు
గరిమతోపూర్వయోగముతొలుతవినుము॥ తేరిగొప్పసకల
మూర్తిమయంబులగుచు - భాసురలీలరూపగుణంబులైన.

యాసోమసూర్యబింబాంతరాళమున - ధళధళవెలిగెడితా
రకలోన - నెలవుగానొనగూర్చినిటలంబు జేర్చి - యేకీభవింత
భూరియుగంబొనరంగపైకి - నెకిరించినదిమింటనిలిచిచూ
చినను- అచటనాత్మప్రత్యయంబులావేళ- ప్రచురంబులైతో
చుబహువిధంబులను - అవిచూచుచునుమనంబట్టిట్టుపోక- న
విరళప్రజ్ఞతోనచటనిల్పుచును - మనమట్లనిలిచినమారుతంబ
పుడు-పనుపడితాపట్టుబడియుండునచట- ఘోసగమారుతమ
నంబులుగూడియున్న- ననదృశంబగుబుద్ధికప్పుడేకాగ్ర- భా
వంబుకలుగునాభావంబుసగుణ - భావంబులెల్లతప్పకచూ
చుచుండు- అచూపుప్రత్యయంబభ్యాససరణి- చేబూడబూడ
సచ్చిదమృతాంభోధి - యందుదృశ్యంబులునణగియున్నటికి॥
జె నమెరుకదాశేషించియుండు - మొనసిధ్యాతధ్యాన
ములులేకయుండు- వెసరాకనిస్సంగవెలుగుచునుండు- అది
యమనసాంఖ్యమగువరయోగ - మదియెదానికిపరంబయి
నదిలేదు- క్రమముగా సకలయోగవిధానములకు- రమణీయ
మయితానెరాజగుచుండు - కావునరాజయోగంబనుపేర
పావనమయిగోప్యభావమయియుండు। మురువుమీరిత్రికూ
టను' ఘూర్ణిల్లుచుండు ॥ పరికించిగననొప్పు పావననలము

దానిపైభూమ్యాదితత్వంబులైదు । పూనినవర్ణముల్ వెలు
గుచుండు। నీనిగ్గులోనుండుననలమండలము। దానిలోఁగా
నుండుతరణిమండలము। మరిదానిలోఁ చంద్రమండలముండు
నందుగాదానిలోనంకురంబొకటి। యిదుగోభవ్యాకారమ
యిచెలువుమీర । నదిబీజమైయుండునఖిలంబులకును। అచట
ప్రవర్తించునఖిలదృశ్యములు॥ ప్రచుర బుగాపరాత్పరవస్తు
వరయు। ఘనతరాఖ్యోజ్యోతిగతిని రేబగలు। మొనసియంత
ర్భాహ్యములవెలుగుచుండు । నీరీతినుపనిషదర్థసూచకము।
వేరెచిత్తములేకవినదృఢంబుగను । అబరారనీలతోయదమ
ధ్యమందు। వెలుగువిద్యుల్లేఖవిధమనమరియు। సురుచిరనీ
వారకోశంబుపగిది। నరయునీలచ్ఛాయమనుతుల్యమగుచు। చె
లువందపావకశిఖదానినడుమ॥ పస్నుగావ్యాపించిపరమా
త్మయుండు। నిచ్చిబ్రహ్మమి.దెశివుడిదియెవిష్ణుండు। నదియె
దేవేంద్రుండునదియెనక్షరము। అదియెపోపరమంబునదియె
స్వరాట్టు। నదియెసత్తామాత్రమనియార్యజనులు। తలతురు
భేదవాదములలోఁబారరు । శ్రుతివిచేతమదించిశ్రుతియనివా
రు । తరుచుగాద్వైతభేదంబులెన్నుదురు । పరతత్వమునభే
దభావంబులేదు। బంగారమొకటియైబహుభూషణములు॥

శృంగారములచేతచిత్రంబులైన । నామరూపంబులెన్నగ వే
రులైన। హేమంబునకు భేదమెందైనగలదె । ఆరీతి వెట్లు పర
మాత్మజూచుటకు । సావధానంబగు శాంభవిముద్ర । వల
నొప్ప త్రుకుటియగావలె నెట్లయనిన। నలరు పాడ్యమిదృష్టియమ
వసదృష్టి । యాలపౌర్ణవమిదృష్టి యనెడిసంజ్ఞలను । విలసిల్లు
చునుమూడువిధములైయుండు । పరగనీమూటిలోపలతో
లిరుంటి ! పరిహరింపుడు మహాప్రజ్ఞదీపింప। సరవిమూడవ
చూపుసాధింపవలయు। మరినేర్పుతో లక్ష్యమును వెలిదృష్టి।క
లిగి రెప్పలపాటుకలగకుండినను । విలసితమగు శాంభవిము
ద్రయగును। యీముద్రధరియించి ఏకాగ్రమతిని । యామద్వ
యముజూడనవుడు మానసము । కరువలిక్షీరోదకన్యాయము
గుచు। పరువడిగూడిలోపలనిలిచియుండు । నొనరంగనందు
లోనొకటిచలించి ॥ చనరెండవదియు నాసరణిదీపింప। నా
రెంటినొకచోటనమరగాగూర్చి । సర్వంబుమరచినిశ్చలత వ
హించి । నిర్వికల్పసమాధి నిలిచిననదియె । రాజయోగంబు
వి రాజమానంబు । నైజమౌసచ్చిదానందపదంబు। పాటిం
చిబుద్ధినీభావంబునందు । నాటించుమనీపలుకునందనుబూచి
రాతంత్రిసచ్చిదానందలక్షణము । ఖ్యాతిగాదెలిపిన గరు

ణించుమనిన॥ జననివీక్షించివిశ్వాసంబుతోడ। మునిరాజచం
ద్రుండుమొనసియిట్లనియె । నలినాక్షిసచ్చిదానందప్రభావ
మెలమితోసిపుడునీకెరిగింతువినుము । లలినొప్పుచున్నదీల
జ్యోతిలోన । విలసిత బిద్బిందు వెలుగుచునుండు। సరసనై
యాచటనేస్ఫటికతేజంబు। స్థిరమైనమాపరశివకళైయుండు।
జననియాశివకళే సత్తననొప్పు । ననఘచిద్బిందుచిత్తనగ
బెంపొందు॥ ౩౦౦॥

నవిరెండుగలయుచేయానందమగుదు । వివరంబుగాత
త్త్వవిదులెరుంగుదురు । ఒనగంగనదియొయింకొకరీతిగాన।
పనిబూనిచెప్పెదపాటించివినుము । నలినాక్షియీసర్వకా
మరూపములు । నలువొప్పసచ్చిదానందంబుగలదు। యీ
రూపనామంబులందంటియున్న। యిలయస్త్రీభావిప్రియము
లుభావింప । నలినాక్షిసచ్చిదానందంబుగాదె । ఇదెసచ్చి
దానందమిందునిభాస్య॥ ఇదియునింకొక్కటిమెరుగజెప్పె
దను। సత్తులింగమనంగసహజమైయుండు। చిత్తనంగంబు
చెలువంబునొనరు । యీరెండునొక్కటియద్వ్యనగదృశ్య।
కారణమైవిశ్వగర్భమైవెలుగు । సువిదరోయింకొకభావము
కనుము । వివరించిజెప్పెదవిశదంబుగాను । అలఘునాదము

మకు లేదు - యది యనిర్వచనియ్యమది యని గాద- యది గల్గి లేనిది యదియె యవిద్య - యది యెట్లుజనియించునది యెట్లన గు॥ ౩౮॥ నది తెటపరచుమన్నను చెప్పదొణగె- పరిశుద్ధ మైనసభంబువీక్షింప - సొరదినీలచ్ఛాయజూపట్లునటుల- ని ర్మలమయి వెల్గునిర్గుణమందు-కర్మకర్మంబు గాగలిగినమాయ- యెందెందుజూచిన యేకమయి పోయ- నుందియ్యను చునుచూ డనుంచునుమాయ - యెందు లేదని మాడనెటు లేదుమాయ - యుంచునీలత్వమాకాశంబునందు - నెటువలెదబ్రొమెరు కతోజూడ॥ ౩౯॥ నటువలెనేదబ్బరై యుందుమాయ-యి దివరదాకని న్నెసినమాయ - మదితోడనీమాయమాయమై పోయ- మాయలోపలిమాయచుహానియ్యమాయ-నీయఖం డజ్ఞప్తినిర్గుణమాయ- యిటువంటిపరమార్థమిద్ధాత్రిలోను- కుటిలచిత్తులకు సద్గురుదూషకులకు - నత్యంతవిషయేంద్రి యాసక్తులకును - సత్యమూహింపని సంశయాత్మలకు- క్షీ ణాత్మలకుమిత్రభేదవాదులకు॥ ౪౦॥ నితిశూన్యులకునుని ర్దయాళులకు- ధామంబుగలనహంకారచిత్తులకు - కామక ర్మాసక్తిగలుగువారలకు - నుపదేశమిచ్చినయూరకె లేని-వి పరీతసంశయాస్పదు లౌదురింతె - గానదృఢజ్ఞానకలితులు

గారు - గానయీసద్విద్యగావలెననుచు- అడిగినప్పుడెనిశ్చి
తార్థుడటంచు- నెడబాయుకేవిద్యయియ్యగారాదు- యీవి
ద్యకగ్రహించకెవడంటివేని॥ ౪౧౦॥ పావనవైరాగ్యపద్ధతులె
రిగి। తలగకమొదటిసాధనచతుష్టయము । చెలగనభ్యాసం
బుజేసినవాడు । శమదమాదులుగల్గిసద్గురుపాద। కమలం
బులేగతిగానమ్మువాడు । కనులముందరపరాంగననిల్చియు
న్న। తనుగన్నతల్లిగాదలచినవాడు । పగులవిత్తములగుప
డెపవిక్షించి। యరిమురితనకేలనంటనివాడు। నొక్కడీసం
సారమెక్కడగల్గు॥ ౪౨౦ ॥ నెక్కడనణగునేనెవ్వడటంచు।
తనుదానెవెతకుచుతనమనంబునను । పనిబూనిఈశ్వరార్ప
ణముజేయుచును । విగతసంకల్పుడైవిహితకర్మములు। తగ
సల్పుచునుభూతదయగలవాడు । సంతతంబునుయదృచ్ఛా
లాభమునకు సంతసింపుచుసాధుజనులతోమైత్రి।శాంతవర్తి
నముచేసలిపెడువాడు । ఆత్మవేత్తలనొక్కసారివంచించి।
యదిదెల్పుమిదిదెల్పుమనిత్వరపడక॥ ౪౩౦॥ సదమలుడైధ
ర్మమనవరతంబు । నాత్మలోభావించియలరెడువాడు। కా
రణగురుమూర్తికనుగొన్నలోనె । సారెకుమెలగుచుసామి
యింకేమి । శరణంబులేదుమీచరణద్వయంబె। శరణంబునా

దనరంగజలమున దానంట చెప్పుడు । మనుజులకొందరాము
హీనుగా నకనె। సంసారియగు మునపడదంబుననుండి । హం
సస్వరూపమెట్లగు నువీడను చ । దూషింపు మంపురుతోడరి
యాకీతి । దూషించువారికి తొలగక యోగి॥౫౦౧॥ చేసినదు
ష్కృత్యముల్ చేయనాతఁగామె । వాసిగాకొంచ రావర యోగి
యగును। నిలుకడగా భక్తి నిలిపి సంతతము। వెలయుత ద్గుణము
లుపినుపింపు చున్న। వారికి నా యోగివాంఛలు లేక । ధీయుడై చే
సిన దివ్యపుణ్యములు। చేయు చునుండు ప్రసిద్ధంబుగాను। సారె
కీలోకాను సారంబుకొరకు । నిర్మలుఁడగు యోగి నేర్పున జే
యు।కర్మముల్ రెండు భాగంబులై పోవు॥౫౦౨॥ నతనికిని రెం
డువంటు మూహింప । నతడని శ్చేదుడై యానందముందు। నిల
తొల్లి యవధూతయా బ్రహ్మవేత్త। పొలుపొందసమయు క్తి
బాయ మచుండుదురు । ఇతరుమవిరక్తుడై యడవి లోనున్న। నిత
డు సంసారియయి యింటిలోనున్న। నెక్కువ తక్కువ లెన్నం
గరాదు। తక్కక మోక్షము ద్దరికిని సమమె। పొలుపొందసం
చితపూర్వజన్మమున। బలముగా కేశవోపాసన జేసి॥౫౦౩॥
గురుతర మోక్షమే కోరినకతన । పరువడి తాసుఖ ప్రారబ్ధ
గతిని। అరుదుగా సంసారియై ముక్తిఁబొందె। పరికించి బాడ

సప్పరమావధూత । యిలపూర్వజన్మంబునందుశంకరుని
చెలగియు పాసనజేసి భావమున । క్రమమున మోక్షమే కో
రించుకతన। రమణియ్యాలీలవిరక్తుడైనిలిచి । మోహపా
శములను మొదలంటగోసి । సాహసుడై ముక్తి సాధించ కో,
రెను॥ ౫౩౦॥ ఇరువురకును మార్గమేకమే గాని ! తరుణీలలా
మ భేదము లేదు చూడ। మదిలోననీవిట్టిమహిమ భావించి మ
దికిరమ్యంబైనమార్గమందుండి । గురుతరముగ పంచకోశం
బులకును। పరమనీవైయున్న భావంబుగనుము। అనఘనియా
దేవియాత్మజుజూచి । వినుమో పరబ్రహ్మ వేదాంతవేద్య

——— * పంచకోశపరిభావప్రకరణము. * ———

పంచకోశంబులభావముల్ దెలియ । నంచితంబుగ దెల్పు
మనన తెండనీయు । వినుమంబయన్నంబువిఖ్యాతి బ్రహ్మ । మ
నిశ్రుతిచెందలియులరంగబడెను । కమలాప్తవార్ధి తేజము
లవలన । కమలంబులుదయించెఘనసస్యసమితి । నావైన
యవ్యౌషధులన్నమైయొప్పె । నాయన్నరసమె దేహంబువ్యా
పిల్లు । అదియాత్మయనికొందరంధ్రుదృగ్ధుల్లక్ష్య । మదినక్ష్యమ
నిగమాంతముల్ పలుక । గాన దేహంబాత్మగాదు భావిం
ప । మానిని ప్రాణమయమాత్మయనుచు॥ ౫౫౦॥ పదరి

ములకు పరబ్రహ్మమనియెడువాడు । ధరణిలోనను వేద శ
త్త్వందు గాని। పరగమూఢుండట్లభావింపగలడె । యిటువ
లెనిశ్చయింబండెనీమనము । నిటులైనవిశ్వమేది తలంచిచూ
డ॥౬౧॥ మదిలోనతనకనుమానంబుకొంత। కదిసీయున్నం
దునకలిగెనవ్వేళ । జననియివ్వలపుచ్చబ్రహ్మమనంగ । నను
బొందపంచకోశాతీతమయ్యె । నదియసత్యంబన్నమనృతం
బువెలయు। నదియెనీవును నేనునఖిలవిశ్వంబు । సచ్చిదానం
దాబ్ధిసంపూర్ణమగుచు । నెచ్చటతగ్గకనేకమయియుండు।న
దిమనంబండెతదన్యభావమున । విదితంబుగాజూచివిశ్వంబు
మరుపు॥ ౬౨॥ నదియెట్లననీసమాధానమతిని । ముదమొ
ప్పవినుమునేమొనసిచెప్పెదను । పనిబూనివామగుల్ఫమున
నాధార। వనజంబెపీడించివామేతరంబు। వామాంకతలము
నపైపుగానిడిన। యామహానియ్యముక్తాసనమయ్యె। నియ్యా
సనంబుననేకచిత్తమున। నెయ్యంబుతోనిల్చివీక్షించినడుము।
దృష్టినాసాగ్రాన తిరముగానుంచి । యష్టమదంబులయణ
చిపిమ్మటను । ఘటపటాదులమాయగాజూచియచట। ఘటి
తమైనదిసత్తుగాగనుంగొనుము । ఆసత్తువిస్ఫురణాకారమ

గుచు। భాసురచిత్తుగాఁ బ్రబలుటఁ దెలిసి। రహిస్థూలసూక్ష్మ కారణముల వెలుగు। సహజవస్తువు నేకసరణిగాఁ గాంచి। యరయ ననేక ధాత్రండకోశముల । వరుస నావరణతత్త్వము లన్నిటిని । సచ్చిదైక్యంబుగా సమరసింపుచును । అస్తిభాతుల చేతనణచివైచుచును॥ ౭౪౦॥ వస్తుమాత్రం బెల్ల నా రూపమనుచు । నారూపమే స్వయంజ్యోతి యేకమున। నారూఢిఁ బరణిచే నాత్మగాఁ గనిన । నాయాత్మ నాదిమధ్యాంతము ల్లేక లగి। మాయావిరహితమయి మది భేదముడుగు । నప్పుడు ఘనసచ్చిదానందపూర్ణ । ము ప్పగా నీవాదు ముజ్జగంబులను। కరమర్థినవుడు జగద్వ్యసనముల । దొరకొని మనమందు దోఁచిన గాని। హ స్తిభాతుల చేతనాత్మగాఁ గనుచు॥౭౫౦॥ నిస్తరంగం బైన నీరధిమాడ్కి। తెరఁ గొప్పని ర్వాతదీపంబు కరణి। సరవితోఁ గాని శాకరుప గిది। కలలేని నిద్దురగతిని భేదంబు। తొలగి సంపూర్ణమయి తుర్యమౌననుచు । నిర్వికల్పంబున నిశ్చలతత్త్వమున। సర్వమఖండమయి సత్యమయి నిత్య । శుద్ధబుద్ధవిముక్తి సాంపాందపరమ । సిద్ధాంతసిద్ధమయి చెలగుచునుండు । నోయబ్బ యచ్చట నేనుండిన యప్పుడె॥ ౭౬౦॥ నీయాత్మ నర్చించు

నిశ్చయంబుగను । వలనొప్పదెలియ గావ లెవనియాత్మ। నల
రారనర్చించునట్టిచందంబు । క్రమముగా జెలి పెనుతఱంతదీ
పింప । నమలమానసరైనయా దేవహూతి। యలఘుత్వమ
యినముక్తాసనమందు । నలువొప్ప గూర్చుండినడుమనిక్కిం
చి । మెడదృఢంబుగనిల్పి మహితాబ్జరిపుల । నడరగా గూర్చి
నాసాగ్రంబు జేర్చి । యనుపమసద్బోధ యనువహ్నిలోను।
జనియించినట్టివిజ్ఞానదీపంబు । కరమొప్పమతియనుకరమున
బూని । చారవగా హృద్వీధి బొచ్చి శోధించి యచ్చటినాళం
బులచ్చటిక్రమము। లచ్చటిచోద్యంబులరసిచూచుచున। చె
లువగు దేహపశ్చిమభాగమందు । నిలచివీణాదండనిజమయి
తనర్చి। యొనరదీర్ఘాస్థియై నెళవుగానమరి । తనుతరంబయి
బిసతంతుచందమున । సురుచిరంబయినసుషుమ్నంబునంటి॥
ఉ.ాం॥ కరమర్థితో నూర్ధ్వగమనంబుచేత । చెన్నలరిన మేరు
శిఖరిపై జేరి। కన్నచోట నెబయలఱలయ భావించి। సొలవక
ప్పుడు వెలిచూపులోచూపు । అలరార గాజూచియటు రెండు
విడిచి । మహానియ్యాతరమయినమధ్యలక్ష్మమున । సహజంబు
గానిల్పి సంతసమంది। నెళవుగా నాత్రివేణిసంగమమున। చల

నమొందకనిల్పిస్నానంబుజేసి । లాలితజ్ఞప్తికళావహాత్రమ
యిన। శిలనాంచెడియాత్మలింగంబుగాంచి। యర్మిలిదీపింప
నర్పింపదలచి । పేర్మిగలిగినచతుష్పీఠమందుంచి। యమలిత
తత్త్వమస్యాదివాక్యములు। క్రమమొప్పమంత్రముల్గాస్మరింపు
చును। ప్రణవంబనెడిగంటపట్టివాయించి। గణనంబుచేయక
కామాదులనెడి। ఘనవిఘ్నకారిరాక్షససమూహముల। ము
నుకొనిబలుదూరమునబారదోలి । కూర్మితోపూర్వమాగు
రునికర్పించు। కర్మనిర్మాల్యంబుకడపటదోలిచి । యలమటశ
మదమంబనెడితో యమునవలరునర్ఘ్యము పాద్యమాచమనం
బు। నలువొప్పనొసగిస్నానంబుసేయించి। బలమయిననము
దృష్టిభావనయనెడి। పరిశుద్ధసాత్త్వికాంబరముధరించి। య
రుదుగాశక్తిత్రయమునొనగూర్చి। తనరయజ్ఞోపవీతంబుగా
నిచ్చి। యనుపమసద్విద్యయనుగంధమలది। తనభూతదయ
నక్షతలుగాధరించి। సుగుణంబుచేగల్గుసుకృతవాసనలు । అ
నుపుష్పములుభక్తియనిపొందుపూజ । మనమురంజిల్లసమ్మ
తముగాచేసి। రమణియ్యమగునంతరంగచతుష్ట। యనుధూ
పముగనిచ్చియక్షతేంద్రియాది। క్రమమొప్పదీపార్తిగాసమ

ర్పించి। యమరివజవతత్వమగుసుధారసము। మునికొన్నినైవే
ద్యము గసమర్పించి। దహరాకారనానంద తాంబూలమిచ్చి। యా
లరనాత్మప్రత్యయప్రకాశమున॥ ౧౨౦॥ పరగసువర్ణ పుష్పం
బుగానిచ్చి। పంచభూతమున ప్రపంచమంతయును। పంచా
ర్తిగాసమర్పణమొప్పజేసి। యటచిత్తవిశ్రాంతి యనుప్రద
క్షిణము। పటుముదంబునజేసి। బ్రహ్మైక్యమనెడి। ఘననమ
స్కారముతఱంతతో జేసి। తనలోనిపరమాత్మతానుజూడ
గనుచూపురూపున నంటిసూటిగానట్టి। చూపురూపైక్య
మయిసుస్థిరమయిన। యాత్మలింగము తానైప్రకాశిం
చు॥ ౧౩౦॥ ఆత్మానుభవమునందలరుచుసోకిఱ। మననంబు
మరచియున్మనీజెందెనపుడు। మునయజ్ఞాతృజ్ఞానములు జ్ఞే
యమందు। లీనంబులై యవివేకసంపూర్ణ। ఘనసచ్చిదానం
దరూపమయినట్టినిర్వాణపదమందునిండియేకముగ। నిర్వి
కల్పంబునిద్దురజెంది। తానునైకొంత దడవుండిలేచి।
మానినీమణి సతుఱమారునికని యె। జయసర్వభూతాత్మ
జయపరమాత్మ॥ ౧౪౦॥ జయచిన్మయాకార జయవేదసా
।జయకలుషవిభంగ జయమహాలింగ। జయసత్యసంకల్ప

జయునిర్వికల్ప । నీకటాక్షంబున నిర్గుణమందె । ప్రకటం
బుగనైక్య భావమొందితిని । యాఆత్మ లోపల నఖిలవి
శ్వంబు । మాయగానున్నది మయినీడమాడ్కి । నదిసత్యమ
న్న మహాద్వైతమందు । నదితస్వతంత్ర మున్నదేతండ్రి ।
వ్యావహారికమాత్మ నంగీకరించి ॥ ౨౫౦ ॥ వావిరిరెండని వ
చియింపవలసె । తుదుతరంబుగ పూజ గొనెడివాడేడ । చిర
భక్తితో పూజసేయువాడేడి । సరవి పూజింప పూజాద్ర
వ్యమేది । యరయగా జ్ఞానసాక్షికమగుచు । నలువొప్ప
నిన్న ధ్యానముసేయుటెట్లు । పొలుపొందగా సర్వపూర్ణ
మానిన్ను । చెలగియావాహన జేయుటదెట్లు । తలపస సర్వ
మున కాధారమౌనీకు । విహితాసనంబు గావించుట యె
ట్లు ॥ ౩౬౦ ॥ సహజమై స్వచ్ఛమైయుండెడినీకు । దనరార న
ర్ఘ్య పాద్యములిచ్చుటెట్లు । గొనకొని పరిశుద్ధమై గనుండునీ
కు । నలర నాచమనమర్పించుటయెట్లు । మలినంబులేక నిర్మల
తచే నెప్పుడు । వెలుగుచుండెడునీకు వేరెతోయమున । చెలు
వొప్ప స్నానంబు చేయించుటెట్లు । కొమరొప్ప విశ్వాధిప
డవైననీకు । నమరంగనొక వస్త్ర మర్పించుటెట్లు । మొనసి

నకులగోత్రములులేనినీకు॥ ౭౭౦ ॥ దనరయజ్ఞోపవీతములి
చ్చుటెట్లు। పొలుపొందనవయవంబులులేనినీకు । వలనొప్ప
ఘనాభరణావళి దాల్చుటెట్లు । లనఘనిర్లిప్తుడవై యున్ననీకు।
మురిసిపుష్పార్చనసేయుటయెట్లు సలలితంబుగ నిరంజ
నుడవౌనీకు। నెలమితోధూపంబులిచ్చుటయెట్లు। వనజాప్త
చంద్రపావకులరూపముల । చననొనరదీపమొసంగుటయె
ట్లు - పొరిపొరినిత్యతృప్తుడవైననీకు॥ ౭౮౦ ॥ నరుదుగా నై
వేద్యమర్పించుటెట్లు । మొనసిసదానందమునజొక్కునీకు।
గొనకొనివిడెముమక్కువనిచ్చుటెట్లు । మురువొప్పనాద్యం
తములులేనినీకు। పరువడిమంత్రపుష్పమునొసగుటెట్లు। సు
నిసితస్వప్రకాశుడవయిననీకు। నొనరనీరాజనమొసగుటయే
లఅనిశముకుతనువునయియున్ననీకు। మొనసిప్రదక్షిణంబును
జేయుటెట్లు। వారకనద్వైతవస్తువౌనీకు॥ ౭౯౦॥ చేరిప్రణా
మంబుజేయువారెవరు । సారస్వతులకగోచరమైననిన్ను। ధీ
రత్వమొసగనుతించుటయెట్లు। పొలుపొందనిశ్చిత్తముగనుం
డునదియొ। నెలవుగా నన్నుధ్యానించుక్రమంబు । ఊరకని
ష్క్రియనుండుచందంబె । భూరిభక్తిని నన్నుబూజించుమని

ధము । ఘననిశ్చలత్వంబుగలిగియుండినదె । యొనరప్రపత్తి
ణంబొనరించుసరణి। యలఘుసోహంభావమందునిలిచినదె
౬౦౦॥ చెలగిప్రణామంబుచేయుభావంబు । మరువనాత్మ
జ్ఞానమున నేకనిష్ఠ । మురిసిసంకీర్తనములుసేయురీతి। పరి
పూర్ణభావసంపదగలిగినదియు । పరమైనమంత్రజపము
సేయుకరణి। యలదాచనెపుడుకృత్యాకృత్యములను। తెలి
యకమరచుటేవివ్యశమంబు । సర్వమఖండమైచర్చింపరాని।
నిర్వాణమొందుటేనీదర్శనంబు । యింతియెకానిమహాబ్రం
హమందు॥ ౬౦౧॥ వంతగాభావంబువేరేమిలేదు। మతియు
న్నగవియున్నమాటెకానుపించు । మతిబోవనదిబోవుమా
యమాయగనె। యతులితబ్రంహమంచాకలంకంబు । సత
మవునెచూడవసంతకాలమున । నతులితంబగుచున్నయబ్జం
త్రుకరణి। వితతిప్రకాశింపవింతగానందు। చెదరెడిమరుమ
రీచికజూచిజలము । కదలుచున్నదిగ్రోల గావలెననుచు।
భ్రాంతిచేమృగములుపరువెత్తికొనుచు॥ ౬౦౨ ॥ నెంతదూ
రముజన్న నెదురుగాజలము । కదలిపోవుచునుండుకైవడిగా
నె। మదికిదృగ్వ్యాపారమహిమలోదోచు। గానిలేదనెడిని

కూడనైనగలదె। యిలముకుమురము లేకనయ్యాక్షి యగను॥
౭౭॥ వెలయగాదనుదానువీక్షింపగలదె- కనుదో యితను
దానుగనిసంతసింప - దనరనద్దంబుసాధనముగానుండు-
నారీతిపరమాత్ముడాత్మప్రకాశ - మారూఢిగాజూడనమ
రుగాబుద్ధి- యలరారసాధనమైయుండుగాని- యగుచుభా
వాతీతమైనబ్రహ్మమును - గనెడిసాధనమెందుగలదెన్నటికి-
గనుచుండునదెసాక్షిగాసంతసంబు - పరిపూర్ణతరమగుబ్ర
హ్మైక్యమునకు॥ ౭౮॥ తెరగొప్ప మరియొకటిదికుంపోవ
లెనె- యలరునవిద్యాకులనెడియుపాధు- లలరారనశియిం
చునాత్మణమందె - యుండెడిచేతనెయుండుపూర్ణముగ-
నుండెడిబ్రహ్మమందూరకేకలయు- సరవితోనందునుసాదృ
శ్యమొకటి- వెరవొప్పగానేనువిన్నవించెదను - ఘటము
భిన్నంబైనఘటపటాకాశ-మదమత్రాకాశమందుండునుగలసి-
యామఠంబణగినయామత్రాకాశ॥ ౮౦॥ మామత్రాకాశమం
దుండియుగలయు। నారీతిగానెయిట్లనపిండాండ-కార
ణవిద్యాదగ్ధంబుగానె- సారదిగాకుండినచోటనేయుండి- సర
గునజీవుడీశ్వరునిలోగలయు- నారీతిగానలఘుతరశుభకాం

డ- కారణమగుమాయక్రమమదేమండె - కర్పూరంబునుగా
న్పకడపటదాను- నాకాశమండెలయంబందిపోవు - నాకర
ణిసవిద్యనతివేగకాల్చి॥౯౧॥ యలవిద్యతుదకుమహాబ్రహ్మ
మంది - వెలిగిలయంబొందివేరుతాలేక- గానగునావిద్యగ
గలిగినయపుడె - పూనిప్రపంచబుద్ధ్యదమెందులేదు- యం
తటయిదిమిథ్యయనరానిదైరుక - వింతయొకరీటిలేకవెలు
గుచునుండు- నటువంటిబ్రహ్మమేనైతికలంక- మీటమీదజని
యింపదదినిశ్చయంబు- బట్టబయిటనెమోక్షపదమిట్లువెలు
గు- నెట్టుకన్గొనరందరీబ్రహ్మవిద్య॥౯౨॥ అప్పుడాకపిలు
డునవ్విసతర్పృపను - దేవహూతినిజూచిధీరుడైపలికె- జన
నిబహుకృతజన్మసంసారవహీమ - ఘనతరమైయుండెగ
నుకశీఘ్రమున- పరమనిర్గుణపరబ్రహ్మైక్యభావ - మరుదు
గాబొందితివంతియేకానీ - యందరికిదిలభ్యమైనప్రపంచ-
మెందుండునటమీదయిందీవరాక్షి - నలువొప్పనెప్పుడున్న
దిలేనిదనుచు - కలమాడిక-లేనిదెకలిగినదనుచు॥౯౩॥ బల
ముగాభావించుపాకృతజనము - వలనవిశ్వంబట్లువర్తింపు
చుండు- నొనరంగవారులేకుండినమాయ - కునికియెక్కడ

లేకయూరకె చెపోవు- ఘనమైనభావింపనీకథప్రబలమై యుం
డు- దానికియుక్తమాత్మజ్ఞానవిద్య- గానతద్విద్యత్తప్పకగు
ప్తమగుచు- వరపతివ్రతనీతివర్తిలంపుచుండు - కర్మముప్పు
చుకర్మకాండాదులెల్ల - సామాన్యగణికాళిసరణినటించు
కామయుక్తులకుభోగములనొసంగు- నాభోగములకోసిన
టువంటిఘనుల- చేభగ్నమగుదానిచిత్రమంతయును- అట
మీదతానాత్మనెడునిశ్చయము - డిటవుగాగలుగు సందే
హంబుదొలగు - నంతటపరిపూర్ణమై తానెవెలుగు- నింతం
తక్కికర్మమెరుగంగరాదు - సులభంబుగలుగునీసుజ్ఞానవిద్య-
సులభకాతిత్వవిస్ఫురణమెట్లనిన॥ ౯౫౦॥ నేనునేననినిండిపం
డినదెహక- నేనినసులభమానెరిగహంకృతిని-నెననకరినమా
ఎశ్చయమందు- గాననిబంధమోక్షంబులు రెండు- వలనొప్ప
గలవనివచియింపవలసె- నలకంటగనినిశ్చయంబుభావించి
యాబంధమోక్షంబులభ్రమల్ గాని - యాబంధమోక్షంబు
లాత్మకెక్కడిది - నిత్యముక్తుండాత్మనిర్గుణుండనెడి - సత్య
మూహించివసంకల్పమేది॥ ౯౬౦॥ ప్రాకటముగనిట్టిభావ
నిశ్చయమ్ము- నీకులభ్యంబయ్యెనెకన్నతల్లి యురవుగమరి

యయునీంకెన్నిచెప్పినను - నిరుపమానందమయునిశ్చలమోక్షశ్రీ-
పరగనీనిశ్చయభావంబుచేత- నరలేకపరమాత్మననుచుభా
వించు- భానుప్రకాశమంబరమెల్లనిండి - పూనియుండియు
నుతద్భాసితకాంతి - స్ఫుటముగాగనరాకభూవృత్తశై
ల - ఘటపటాద్యాకారమందులవెలుగు॥౯౦॥కరణిపరా
త్మడాసనమునను౦డి-కిరణాదులందుప్రకాశింపుచుండు-సం
తతంబీరహాస్యముభావమందు - చింతింపుచుండుసుస్థిరతరం
బుగను- ఇలభానుడస్తాద్రికరిగినవేళ- కళలచేవెలుగుతక్కక
జాలమెల్ల- నమరనాతనియందుననుపొందుమాటిక్క- నమన
సక్కమునననగునావిశ్వమెల్ల - గనుకనీయమనస్కఘనతరా
భ్యాస-మునసీవుపరిపూర్ణముగనిండియుండు॥౯౧॥మానస
యగువెంగమాంబికారచిత- మయినట్టిరాజయోగామృత
సార- మందెన్నగాతృతీయప్రకరణంబు-పొందుగాతరికొం
డపురిధాముడైన- వీరనృసింహుండువెలయగైకొనియె-ధా
రుణినాచంద్రతారార్కముగను॥

రాజయోగసారము - సంపూర్ణము.

